మిగిలిన డబ్బులుతీసి జేబులో దోపుకుని, చరచరా నడిచాడు అక్కడి నుంచి!

## సీనియర్!

'స్వయం ఉపాధి పథకం'గా రచనా వ్యాసంగాన్ని చేపడదామా అన్పించింది నిరుద్యోగి సదాశివానికి, హఠాత్తుగా. వెంటనే, "ఛ.ఛ! సాహిత్యాన్ని వ్యాపారంగామార్చడమా?" అనితలచాడు. ఆ వెంటనే అతనికి రచనా వ్యాసంగం ఓ కుటీర పరిశ్రమగా పేరు పొందిన విషయం గుర్తొచ్చింది. అది గ్రీన్ సిగ్నల్‌లా తోచి రైటో! అనుకున్నాడు– ముందుకు దూసుకుపోవడానికి!

కాని కాయితం, కలం పట్టుకుని కూచున్నపుడుగాని తెలిసింది కాదు సదాశివానికి, రాయటం ఎంత కష్టమో! అందులోనూ తనలాంటి కొత్తవాడికి! పెన్ను విదిలిస్తే ఇంకు బొట్టు బొట్టుగా రాలి పడుతోందే తప్ప ఒక్క వాక్యమైనా రాయలేకపోయాడు.

అప్పుడు గుర్తొచ్చిందతనికి ఓ సాహిత్య వ్యాసంలో 'కథకు ప్లాటు ముఖ్యం' అని రాయబడిన సంగతి! ప్లాటంటే రచయిత దేనిమీద కథ రాయాలనుకుంటాడో (కాయితం కాదు) అదని తెలుసు! ఆ మాత్రం తెలివి తేటలున్నాయి సదాశివానికి. కాని, ఏ విషయంపై కథ అల్లాలనేది అతనికి వెంటనే తట్టలేదు, సహజంగానే!

అప్పుడే అతనికి ఇటీవల బాగా వ్యాప్తిచెందిన కాపీరాయుళ్ళ సంప్రదాయం గురించి తెలిసింది. ఎంతో పేరు తెచ్చుకుని, ప్రసిద్ధులైనవాళ్ళే చేస్తుండగా నేను దాన్ని అనుసరించడం తప్పెలా అవుతుందనే ధీమాతో కాపీకి తగిన ఆంగ్ల నవల కోసం వేట సాగించాడు. వెదికి వెదికి ఓ నావెల్టీగల పుస్తకం పట్టుకుని శుభ్రంగా దాన్ని తెలుగులో కథగా రాసేశాడు!

ఇంతలో పక్కింటివాళ్ళకి అతిథిగా తన అభిమాన రచయిత విచ్చేసినట్టు తెలిసింది సదాశివానికి. కథ ఆయన చేత చదివించి, ఆశీర్వాదాలందుకుని, పత్రికకి పంపిస్తే తన రచనా వ్యాసంగం మూడు నవలలు, ఆరు కథలుగా వర్ధిల్లవచ్చనే ఆశ కలిగిందతనికి. వెళ్ళి ఆయనకి నమస్కరించి తన గురించి చెప్పుకుని కథ చేతిలో పెట్టాడు.

ఆ రచయిత విసుగు దాచుకుని కథ చదివి ముఖం చిట్లించాడు.

"ఇది ఫలానా ఆంగ్ల నవలను కాపీ కొట్టి రాశారు కదూ?" కొట్టినట్టే అడిగాడు.

సదాశివం బిత్తర పోయాడు.

బుకాయించేంత అనుభవజ్ఞుడు కాదు గనుక వెంటనే తన తప్పు వప్పుకున్నాడు.

"మీకు రాసే శక్తి లేనపుడు చేతులు ముడుచుకుని కూర్చోవాలి. అంతేకాని ఇలా పరభాషలనుంచి కాపీకొట్టి రచయితగా చలామణీ అవాలనుకోవడం చాలా సిగ్గుచేటైన విషయం!"

చివాట్లు తిని నీరసంగాకాళ్ళీడ్చుకుంటూ వెళ్ళిపోతున్న సదాశివాన్ని చూస్తే రచయితకి జాలి కలగలేదు సరికదా, పళ్ళు నూరుకున్నాడు.

"నేను కాపీకొట్టి సీరియల్‌గా రాద్దామనుకున్న నవల వీడు ముందే చదవటం నన్నెంత నష్టపరచింది! ఇప్పుడా నవలను కాపీకొట్టే అవకాశం మిస్సయినట్టే గదా!" అనుకున్నాడు కోపంగా.

— జాకీ




**స్వాతి**

# అభివందనం

ఉత్తమాభిరుచులుగల పాఠకుల స్వంత పత్రికలుగా విఖ్యాతమైన విపుల, చతురలు 100వ సంచికలను వెలువరించుకున్న సందర్భంగా అపూర్వమైన రీతిలో మేము ప్రకటించిన కథలు-నవలల పోటీని విజయవంతం చేసిన రచయితలకు, రచయిత్రులకు మా ధన్యవాదాలు.

పోటీలకు ఆఖరుతేదీ మే 31నాటికి ముందే వందల సంఖ్యలో నవలలు, వేలసంఖ్యలో తెలుగు, తెలుగేతర భాషాకథలు మహోత్సాహంతో పంపిన సాహితీ స్రష్టలకు మా అభివందనలు.

ఉత్తమ సాహిత్యసృష్టిని గౌరవించి, పట్టంగట్టి, పాఠకులకు విందుచేసే ప్రయత్నంలో ప్రామాణిక పద్ధతులను అనుసరిస్తున్న మా సంస్థ ఈ పోటీ ఫలితాలను వీలయినంత తక్కువ వ్యవధిలోనే ప్రకటించగలదని ఆశిస్తున్నాం.

వివరాలు త్వరలో ఈ పేజీలలోనే...

